

ఖలీల్ జిబ్రాన్

# శిఖరాలూ - లోయలూ

డా॥ సి. నారాయణరెడ్డి

# శిఖరాలూ-లోయలు

ఖలీల్ జిబ్రాన్ కవితోక్తులకు
స్వచ్ఛందానుసరణం

డా॥ సి. నారాయణరెడ్డి

ప్రచురణ




యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5, కింగ్స్‌వే, సికిందరాబాదు-3

**SHIKHARALU – LOYALU**

**By Dr. C. Narayana Reddy**

KHALIL ZIBRAN'S SAYINGS IN TELUGU



యువభారతి

ప్రచురణ : 28

ప్రథమ ముద్రణ : 3,200

1 డిశంబర్, 1974

చిత్రాలంకరణ :

బాపు

ముద్రణ :

ప్రతిభా ఆర్ట్ ప్రింటర్స్

రాజమొహల్లా, హైదరాబాద్-500027

ముఖచిత్ర ముద్రణ :

విస్టాస్ ప్రింటర్స్

హైద్రాబాద్.

ప్రతులకు :

యువభారతి

5, కింగ్స్‌వే, సికింద్రాబాద్-500003.

లేదా

యువభారతి కార్యాలయం

ఆంధ్రసారస్వత పరిషత్తు భవనములు

తిలక్ రోడ్, హైద్రాబాద్-500001. వెల : 2-00 రూ.

PAPER USED FOR THE PRINTING OF THESE BOOKS
WAS MADE AVAILABLE BY THE GOVERNMENT OF INDIA
AT CONCESSIONAL RATES.

YUVABHARATHI IS GRATEFUL.



# మా మాట

సమన్వయ దృక్పథం ప్రజాస్వామ్య పరిరక్షణకు తోడ్పడుతుంది. ఉత్తమ సాహిత్యాధ్యయనం సమన్వయ సాధనకు తొలిమెట్టు. బహుజన హితంకోసం, బహుజన సుఖంకోసం మనిషి ప్రతిభ వ్యక్తం కావాలి. మనిషిలో స్వతస్సిద్ధంగా, అంతర్నిహితంగా ఉన్న మానవత్వాన్ని జాగరితం చేయగలిగే శక్తి సాహిత్యానికే ఉన్నదన్న నమ్మకంతో, ఉత్తమ సాహిత్యాధ్యయనానికి అనువైన పుస్తక ప్రచురణ, సాహిత్య సమావేశాలు, గోష్ఠులు నిర్వహిస్తూ యువభారతి కడచిన పదేళ్లగా తెలుగు ప్రజల సంస్కృతి వికాసానికి యథోచితంగా కృషి చేస్తున్నది.

ప్రాచీన, అర్వాచీన సాహిత్యాలతో దిఙ్మాత్రంగానైనా పరిచయం కలిగించాలనే ఉద్దేశంతో, సమకాలీన సమాజం ఎదుర్కొంటున్న సమస్యలను సునిశితంగా సమవేదనా దృక్కోణంతో పరిచయం కలిగించాలనే ఉద్దేశంతో యువభారతి 'సాహితీవాహిని' పరంపరను ప్రచురిస్తున్నది. ఈ పరంపరలో ఇంతవరకూ వెలువడినవి కేవలం సాహిత్యాధ్యయనానికి సంబంధించినవే. ఇకముందుముందు కౌటుంబిక, సాంఘిక, వైజ్ఞానిక విషయాలకు సంబంధించిన పుస్తకాలను కూడ ప్రచురించి పఠితృలోకానికి అందజేయడానికి ఏర్పాట్లు చేస్తున్నాము.

సాహిత్యం సార్వకాలీనమని, సార్వజనీనమని, విశ్వజనీనమని ప్రాజ్ఞుల అభిమతం కనుక అంతర్జాతీయ ప్రఖ్యాతి నార్జించిన మహాకవుల, శేముషీ సంపన్నుల భావాలునుకూడా తెలుగువానికి అనువైన పద్ధతిలో అందించాలని యువభారతి ఆకాంక్ష.

తన విలక్షణమైన ప్రతిభతో మానవ సమాజాన్ని జాగరితం చేసిన ప్రతిభామూర్తి ఖలీల్ జిబ్రాన్. ఆయనది లెబనాన్ దేశం. మాతృభాష అరబ్బీ. తనభాషలోనూ ఇంగ్లీషులోనూ ఆయన తనరచనలను వెలువ

రించాడు. సత్యాన్వేషకుడు ఎన్నికష్టాలను అనుభవించాలో అన్నికష్టాలనూ అనుభవించాడు. జిబ్రాన్ కవితతో పరిచయం మానవుడందుకోవలసిన మహోన్నతాదర్శాలతో పరిచయం. మహాకవి జిబ్రాన్‌ను తెలుగు పఠితృలోకానికి మొదట సారిగా పరిచయంచేసిన అవకాశం యువభారతికే దక్కింది. ప్రజాకవి కాళోజీ 'జీవనగీత'గా ఖలీల్ జిబ్రాన్ The prophet ను 1968లో యువభారతి అందించింది. అప్పటినుంచీ ఇంతవరకూ జిబ్రాన్ రచనలు తెలుగులోనికి రానేలేదు.

డాక్టరు సి. నారాయణరెడ్డి గారు మహాకవులు. స్నేహపాత్రులు. తన విలక్షణమైన ప్రతిభతో ఆధునికసాహిత్యరంగంలో సమున్నతస్థానం సంపాదించుకున్నవారు. పరిశోధకులుగా, అధ్యాపకులుగా, వాగ్మివతంసులుగా తెలుగుసాహిత్యలోకానికి ఆయనచేస్తున్న సేవ అపూర్వం. తనభాషలోనే కాక ఇతరభాషలలోని విలువైన భావాలను తనప్రజల కందించాలన్న మహత్వాకాంక్ష రెడ్డిగారిలో అత్యుత్కటంగా ఉండబట్టే మీరాబాయి గీతాలను, గాంధీసూక్తులను మరెన్నో ఉర్దూకవితా ఖండికలను తెలుగు నుడికారపు సొంపులతో స్వయంప్రతిభా పరీమళంతో అందించారు. "శిఖరాలూ-లోయలూ" ఖలీల్ జిబ్రాన్ సాహిత్యంలోని కొన్ని కవితోక్తులకు స్వచ్ఛందంగా సాగిన అనుసృజనం. జిబ్రాన్‌ను రెండవ సారిగా ఇంతముచ్చటగా, ఇంత అందంగా, ఇంత కవితాత్మకంగా యువభారతి అందించగలుగుతున్నందుకు హర్షోత్ఫుల్ల హృదయంతో డా॥ సి. నారాయణరెడ్డి గారికి కృతజ్ఞతాభివందనాలను సమర్పిస్తున్నది.

విశ్వకవి ఖలీల్ జిబ్రాన్ ప్రతిభాపాండిత్యాల మర్మమెరిగిన మనీషులు, నిరంతర అధ్యయనశీలురు, ఆంధ్రప్రదేశ్ హైకోర్టు న్యాయమూర్తులు శ్రీ ఒ. చిన్నపరెడ్డిగారు ఈ కవితాసంపుటికి విలువైన పీఠికను సమకూర్చినారు. శ్రీరెడ్డిగారికి యువభారతి హృదయపూర్వకమైన కృతజ్ఞతలను అందజేస్తున్నది.

ఈకవితాసంపుటిని తమ చిత్రకళావిన్యాసంతో అందంగా అలంకరించిన ప్రముఖ చిత్రకారులు శ్రీ బాపుగారికి మా ధన్యవాదాలు.

సహృదయులు యువభారతి నిర్వహిస్తున్న కార్యక్రమాలకు రూపురేఖలు దిద్దడంలోను, వాటిని విజయవంతం చేయడంలోను యథోచితంగా తోడ్పడి తమతమ శక్తియుక్తులను, ఔదార్యాన్ని, సాహిత్యాభిమానాన్ని ప్రకటిస్తారని ఆశిస్తాము.

1-12-1974

ఇరివెంటి కృష్ణమూర్తి
అధ్యక్షుడు.




# యువభారతి పరిచయము

మనిషిలో అంతర్లీనంగా, నిక్షిప్తంగా ఉన్న ప్రతిభా పరిమళాలు పరివ్యాప్తం కాగలిగినప్పుడే అతని సృజనాత్మక శక్తికి సార్థక్యం చేకూరుతుంది. సమాజంలో సౌందర్యం, సౌజన్యం పెంపొందడానికి అనువైన వాతావరణం ఏర్పడుతుంది. పరస్పరావగాహనం జరుగుతుంది. నిర్మాణాత్మక దృక్పథాలకు ప్రాచుర్యం లభిస్తుంది. సమైక్యభావాలు కుదురుకుంటాయి.

యువభారతి గడచిన పదేళ్లుగా సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యంకంటె ఇతరమైన సాత్త్వికసాధనం లేదనే విశ్వాసంతో ఇతోధిక కార్యక్రమాలను రూపొందించి కృషి చేస్తున్నది. సాధ్యమైనంత తక్కువ వెలకు, వీలైనంత ఎక్కువమందికి ఉత్తమ సాహిత్యాన్ని అందిస్తే సాహిత్యంపట్ల ప్రజానీకానికి ఆసక్తి పెరుగుతుందనే నమ్మకంతో.... ప్రచురణ కార్యక్రమాన్ని చేపట్టింది. ఈనాటికి 32 ప్రచురణలను ప్రచురించి, రెండులక్షల ప్రతులకు పైగా సాధ్యమైనంత తక్కువవెలకు తెలుగు పాఠకులకు అందించినది.

భారతదేశంలోని నలుమూలలవారూ యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమంలో పాలు పంచుకోగలిగేందుకు ప్రారంభింపబడిన సాహితీమిత్ర పథకంలో దాదాపు 7,500 మంది సహృదయులు చేరి ప్రణాళికను విజయవంతం చేశారు. ఈరోజు నుండి ఈ ప్రణాళిక కొత్తరూపు దలుస్తున్నది. ఇందులో కూడా సహృదయులు చేరి తమ సహాయ సహకారాలు అందజేస్తారని ఆశిస్తాము. యువభారతి భవిష్యన్నిర్మాణంలో సహకరించేందుకు ఆరంభింపబడిన శాశ్వత జీవిత సభ్యత్వ పథకాలలో భారతీమిత్రులుగా దాదాపు 460 మంది, భారతీ భూషణులుగా 50 మంది చేరారు.

ఉడతాభక్తితో మేము చేస్తున్న భాషాసేవకు అండదండలుగా నిలిచింది ప్రజలు, వారి సౌహార్దం, భాషాప్రియత్వం ఇవే మా పెట్టుబడి. మా తపస్సు ఫలించి తెలుగు దేశంలో అధ్యయనశీలతా సౌజన్యం పెంపొందాలని ఆకాంక్షిస్తూ-

ఇరివెంటి కృష్ణమూర్తి
అధ్యక్షుడు
యువభారతి.

1-12-1974

# అనుసృజనం

" ఈనాటి నా హృదయఘోష
రేపటి కోటి హృదయాల జీవదృష "

జిబ్రాన్ గుండెను చీల్చుకొని ఉబికి వచ్చిన జీవనాద మిది. కవిత్వాన్నీ జీవితాన్నీ కలిపి కుట్టిన అక్షరసూత్రమిది.

జిబ్రాన్ నయన యుగళం – దర్శనం, వర్ణనం. అసలు ఏకవి వ్యక్తిత్వానికైనా ఈ గుణద్వయమే మూలధనం.

దర్శనం ఉన్న కవే శిఖరాల ఎత్తులూ, లోయల లోతులూ ఏకకాలంలో చూడగలుగుతాడు. చూసింది మననం చేసుకో గలుగుతాడు. మననం చేసుకున్నది తన వర్ణనా ప్రతిభను బట్టి కావలసిన రంగులతో బొమ్మకట్టగలుగుతాడు.

ఇంతకూ దర్శనం vision. వర్ణనం provision .

ఈ రెండు శక్తుల సముచిత సమ్మేళనమే జిబ్రాన్ కవిత. పదార్థ విశ్లేషణంలో ఎంతటి తాత్త్వికతను ప్రదర్శి స్తాడో, భవితవ్య నిరూపణంలో అంతటి ఆశావాదాన్ని ప్రక టిస్తాడీకవి. చిన్నచిన్న మాటల్లో మిన్నేరులను పారించడం ఈ కవికి వెన్నతో పెట్టిన విద్య. మామూలు సత్యాలను కూడా తన రసవాద శక్తితో మహత్తర సువర్ణశలాకలుగా మలచుకోవడం ఇతని మౌళికత.

"చట్టాల వలలు పన్నే దెందుకు ?
చిట్టిచేపలను పట్టేటందుకు."

యుగయుగాలుగా వస్తున్న సాంఘిక వ్యవస్థ చెవులు మెలిపెట్టి చెప్పిన నిష్ఠుర సత్యమది. ఇలాంటి సత్యాలు జిబ్రాన్ సూక్తుల్లో కోకొల్లలు.

చిరకాలంగా ఖలీల్ జిబ్రాన్ కవితలను చదివి కొన్నిటిని ఊహల్లో ప్రతిష్ఠించుకున్నాను, మరికొన్నిటిని ఒంటబట్టించు కున్నాను. ఏ కొన్నిటినైనా తెలుగులో అనువదిస్తే బాగుం టుందని అనుకుంటూనే ఉన్నాను.

అప్పుడప్పుడు, హృదయం స్పందించినప్పుడు తెలుగులో అల్లుకున్న ఖలీల్ కవితోక్తులను చిన్న సంపుటిగా వెలువ రించాలనుకున్నాను.

ఆకాంక్ష నాది, ఆకృతి తీర్చింది 'యువభారతి'. అను సృజనంచేసింది నేను; అమూల్య పీఠికపై ఈ సంపుటిని నిలిపింది ప్రముఖ న్యాయమూర్తి, ప్రగతి పథవర్తి శ్రీ చిన్నపరెడ్డిగారు.

మాటలతో బొమ్మగీచింది నేను, రేఖలతో జీవంపోసింది బాపు.

అందరికీ కృతజ్ఞతలు.

'త్రివేణి' వివేకనగర్
హైద్రాబాదు–500020.

డా॥ సి. నారాయణరెడ్డి

# ముందుమాట

—జస్టిస్ ఓ. చిన్నపరెడ్డి.

ఖలీల్ జిబ్రాన్ మహాకవి, విజ్ఞాని. ఆంధ్రసాహితీ ప్రపంచానికి ఖలీల్ కవితనూ, విజ్ఞానాన్నీ 'శిఖరాలూ- లోయలు' అనే ఈ కవితోక్తుల సంపుటి ద్వారా డా॥ నారాయణరెడ్డి పరిచయం చేస్తున్నాడు. 'శిఖరాలూ- లోయలు' చదివే నారాయణరెడ్డి కవితా ప్రియులందరూ తప్పక జిబ్రాన్ కవితా - విజ్ఞానారాధకులవుతారని ఆశిస్తున్నాను.

'శిఖరాలూ- లోయలు' ఖలీల్ జిబ్రాన్ కవితోక్తుల అనుసరణకు నారాయణరెడ్డి మంచిపేరే పెట్టాడు. శిఖరాలు పర్జగర్భిత మేఘాలనందుకుంటూ ఔన్నత్యాన్నీ, గాంభీర్యాన్నీ సూచిస్తాయి. వానకు తడిసిన పచ్చగడ్డి పాన్పును పరచుకొన్న లోయలు లోతునూ, మెత్తదనాన్నీ సూచిస్తాయి. ఖలీల్ కవితలో ఇంకా ఎన్నో భావసౌందర్యాలంకృత మధుర గీతికలు, రచనలు ఉన్నాయి. కానీ నారాయణరెడ్డి పదునుకోసం, పటుత్వంకోసం ఏరినట్టున్నాడీ కవితోక్తులను, సౌందర్యమాధుర్యాలను పరిత్యజించకుండా.

జిబ్రాన్ కవిత హృదయంలోనుండి పెల్లుబికిన ప్రవాహం. ప్రతి హృదయాన్నీ స్పృశిస్తుందా ప్రవాహం. అదొక మృదుఘంటానాదం; ప్రతి గుండెలో మారు పలికే రాగం. నిరాటంకంగా ఊపిరిలో కలిసే పరిమళం. మానవుని నీడలా వెన్నంటి వేధించే నిరంతర జీవిత సమస్యలను నిర్మలంగా కరుణామయ హృదయంతో పరీక్షించి పరిష్కరించ ప్రయత్నిస్తాడు జిబ్రాన్. తా నర్థం చేసుకున్న సత్యాలు, అందరకూ అందజేస్తాడు; మృదు మధురశైలిలో సునాయాసంగా, గంభీరంగా, సూక్తిరూపంగా, సూత్రరూపంగా, సామ్యరూపంగా.

జిబ్రాన్ భాషలోనేకాదు, భావంలో కూడా అందముంటుంది. నంక్షిప్తత, సౌందర్యం జిబ్రాన్ కవిత ప్రత్యేకతలు. కరుణ, జాలి, జిబ్రాన్ విజ్ఞాన ప్రత్యేకతలు. పరుష మెరుగదు జిబ్రాన్ కవిత. కలుష మెరుగదు జిబ్రాన్ హృదయం.

జిబ్రాన్ రచనలను, ఆలోచనలను, తెనుగువారికి నారాయణరెడ్డి పరిచయం చేయడం ఎంతో సమంజసంగా ఉంది. జిబ్రాన్ మానవతామూర్తి. అతని కవితకు

మానవతే పరమావధి. నారాయణరెడ్డి మానవతాభిలాషి. అతని కవితకు మానవతే మహదాశయం. వారిరువురి కవితావస్తువులు మానవుడు, మానవ జీవితం. వారు కోరేది విశ్వ మానవప్రేమ, వారన్వేషించేది మానవుణ్ణి ఉత్తేజపరిచేజ్ఞానం, వారు నేర్పించేది మానవజాతిపై జాలి, కరుణ. ఇరువురి రచనల్లో విన్పించే నినాదం, నిర్మల మానవతాగానం. "పరిమళాల నెవడాపును? పైరగాలి నెవడాపును ? ఎవడాపును మానవతా రవి రుక్కులను, కవి వాక్కులను?" అన్న నారాయణరెడ్డికి గాక వేరెవరికున్నవి? "ప్రకృతి ప్రసవించిన పాపలే పూలు, అనురాగం కుసుమించిన పూలే పాపలు" అన్న జిబ్రాన్ కవితా మధువును చదువరుల కందించడానికి పరిపూర్ణతార్హతలు ?

జిబ్రాన్ అల్లిన ప్రతి కావ్యంలో, సామ్యంలో, నెరిగపోగువలె మానవత ప్రతిచోటా గోచరిస్తుంది. ఆ మానవత ప్రధానాంశాలు విశ్వమానవ సౌభ్రాతృత్వం, సౌజన్యం, స్వాతంత్ర్య ప్రీతి. జాతి, మత, దేశ భేదాలతనికి అవసరంలేదు. ఒక సారన్నాడు : "నీవు చర్చిలో అర్చించినా, మసీదులో ప్రార్థించినా, సినగోగ్‌లో ఆరాధించినా నీవు నా సోదరుడవు. నేను నిన్ను ప్రేమిస్తాను" అని. మానవ రూపవికాసాలు, శక్తిసామర్థ్యాలు అనవసర విభేదాలతో, అర్థహీనములైన వైరుధ్యాలతో వ్యర్థమై పోతున్నవే అని ఆయన పడే మానసిక క్షోభ మళ్ళీమళ్ళీ వ్యక్తమవుతుంది. నీరసవర్గాల పీడన గమనించి, ఆవేదనపడి, వారి దాస్య శృంఖలాలను ఛేదించి వారికి క్షేమం సమకూర్చాలనే ఆయన ఉద్రేకం తిరిగీ తిరిగీ రచనల్లో ద్యోతకమవుతుంది.

మానవ విభేదాలను గురించిలా అన్నాడు:

"అసలే మనుష్యులు దుర్బలులు
అందులో చచ్చేటన్ని చీలికలా?
అసలే ఈలోకం ఇరుకు
అందులో ఇనిన్ని రాజ్యాలా?"

అతని స్వాతంత్ర్య ప్రీతి ఎలాంటిదంటే,

"నా ఆస్తిని హరించినా
నా రక్తాన్ని చిందించినా
నా ఆత్మను బాధించలేరు
నా ధర్మాన్ని సాధించలేరు", అన్నాడు.

అమాయక పీడిత ప్రజలకు జాలికాదు, న్యాయం కావాలంటూ అంటాడు:

"ఎందుకు చూపుతావు జాలి?
మాకు న్యాయం కావాలి.
అపరాధులపై కురిపించుకో నీజాలిని
అమాయకులు మాత్రం కోరుకునేది న్యాయాన్ని".

ఖలీల్ ఒక రెబెల్. నిరంకుశ పాలకవర్గాన్ని, మూఢ మతాచార్యులనూ బహిరంగంగా ఆక్షేపించి తిరుగుబాటు చేశాడు. దేశంనుండి బహిష్కరింపబడ్డాడు, మతంనుండి వెలివేయబడ్డాడు. విదేశాలనుండే నిరంకుశత్వాన్ని నిరసిస్తూ, కృత్రిమ వేదాంతాన్ని బయటపెడుతూ భావ, వాక్స్వాతంత్రాలను ప్రకటిస్తూ కవిత సాగించాడు:

నిరంకుశ ప్రభువులను గురించి అన్నాడు:

"శిరసెత్తుతారు కొందరు గిరిశిఖరాల్లా
కానీ పడిఉంటారు కారుచీకటి గుహల్లా"

మూఢ మతాచార్యులను గురించి అన్నాడు:

"పరమ భక్తుల అస్తి
పంజరమ్ములపైన
గుళ్లుకట్టే ధర్మ
కోవిదులు ఎందరో?"

స్వేచ్ఛాప్రియుడు, జిబ్రాన్, సవాలు చేస్తాడు:

"ఎవరితో ఉంటావో తేల్చుకో—
నిన్నటి దాస్య వర్తులతోనా?
రేపటి స్వేచ్ఛా మూర్తులతోనా?"

ఖలీల్ కవితకూ సమకాలీన జీవితానికీ ఏమాత్రం సంబంధం లేదని కొందరు మార్క్సిస్టు విమర్శకుల అభిప్రాయం, ఆ విమర్శ ఆదరణీయం కాదు. ఖలీల్ ఏ యుగానికీ చెందనివాడు. అన్ని యుగాలకూ, అన్నికాలాలకూ, అన్ని దేశాలకూ, అన్ని జాతులకూ చెందినవాడు. ఖలీల్ చెప్పేవి జీవితసత్యాలు, అవి నిరంతర జ్యోతులు. అన్నాడు గదా,

"ఎవరి నెవరు సృష్టించిరి
మనిషిని దేవుడా? దేవుణ్ణి మనిషా?"

"నరకంలేదు యాతనలో—అది
ఉన్నది రిక్తహృదయంలో"
"మంచు బిందువును తిలకిస్తున్నాను
మహోదధి రహస్యాలు కనుగొన్నాను."

ఈ మాటల్లో యుగయుగాల విజ్ఞానమున్నది గదా! ఏనాటికైనా ఈమాటలు సత్యమే కదా!

"దేశ నాశకుడెవడు?
నేల దున్ననివాడు
నేత నేయనివాడు
రాళ్లు మోయనివాడు
రాజకీయమే వృత్తిగా
రంగు ఫిరాయించేవాడు"

సమకాలీన రాజకీయ నాయకులను గురించి కాదా! ఈ పంక్తులు? నేటి నాయకులకూ వర్తించవా! ఇవి?

"నిరుపేదలు పండించిన పంటను
కిరాతకులు కాజేస్తుంటే
చట్టంపేరుతో ఉన్న దమననీతి
చుట్టూ కాపలా కాస్తున్నది"

మార్క్సిస్టు సిద్ధాంతాల ప్రకారం, చట్టాలు, న్యాయస్థానాలు నిర్వహిస్తున్న పాత్ర ఇది కాదా?

పోయిన సంవత్సరం ఉస్మానియా విశ్వవిద్యాలయ విద్యార్థులు ప్రతి గోడమీదా వ్రాశారు "భావాలకు సంకెళ్లులే"వని. అదే భావం జిబ్రాన్ ఎలా చిత్రించాడో చూడండి:

"నాచేతులకు సంకెళ్లు వేసినా
నా కాళ్లకు గొలుసులు కట్టినా
చీకటి చెరసాలలో నన్ను నెట్టినా
స్వచ్ఛందమైన నా ఆలోచనలను
చచ్చినా బంధించలేరు."

జిబ్రాన్ అభ్యుదయమంటే పురోగమనమంటాడు:

"గతానికి మెరుగులు దిద్దడమే కాదు అభ్యుదయం
భవిష్యత్తు వైపు పరుగులు తీయడమే అభ్యుదయం"

తిరుగుబాటు వాంఛిస్తాడు. కానీ కట్టుబాటుండాలంటాడు.

"తిరుగు బాటులేని జీవితం
వసంతంలేని ఋతువలయం.
కట్టుబాటులేని తిరుగుబాటు
వట్టి ఎడారిలో వసంతోదయం"

ప్రేమ, ప్రేమికులంటే తన హృదయాన్నిస్తాడు:

" ఏ ఋతు సంగతి లేకున్నా వికసించే కుసుమం ప్రణయం".
"మొదటి ముద్దు– వలపు పాటకు తొలకరి
జీవిత తరుశాఖా శిఖపై విరసిన తొలివిరి
నాలుగు పెదవులు పలికే మౌన మంత్రాక్షరి"

మాతృభాషపైని మక్కువవల్లనో, మరి నారాయణరెడ్డి తీయని కవిత మీది మమతవల్లనో, ఈ స్వచ్ఛందానుసరణా కవితోక్తులు ఖలీల్ జిబ్రాన్ మూల సూక్తులకే వన్నెదెచ్చిన వనిపిస్తుంది నాకు. అనుసరణలు కావవి జిబ్రాన్ కవితను వెల్గించిన కిరణాలవి. చూడండి మరి, మూలంలో

"The human soul is but a part of a burning torch
Which God separated from Himself at creation".

నారాయణరెడ్డి అనుసరణలో,

"మానవాత్మ– ప్రజ్వలించే మహాజ్వాల
విడివడిందది పరమాత్మనుండి సృష్టివేళ"

మూలంలో

"How many flowers
Possess no fragrance from the day
Of their birth! How many clouds
Gather in the sky, barren of rain,
Dropping no pearls"

నారాయణరెడ్డి అనుసరణలో.

"పుట్టినప్పటినుండి పరిమళాలే లేని
పూలెన్ని లేవు?
గగనాన మూగి వర్షించగాలేని మే
ఘాలెన్ని లేవు?"

ఇలాంటివి ఇంకా ఎన్నో! మీరే చదవండి.



సౌందర్య సత్యాలు - జీవితం
సాధించిన రెండు వరాలు.
ఒకటి ప్రేమికుని హృదయంలో
ఒకటి శ్రామికుని స్వేదంలో.

## 2

మహాశయులారా! మరిచిపోతారెందుకని
గుహల్లో నివసించే మనుషులింకా ఉన్నారని.
ఏవీ ఆ గుహలు?
ఇవిగో మన హృదయాలు.

## 3

అవని నిశ్వసిస్తే జననం
అది ఉచ్ఛ్వసిస్తే మరణం.

## 4

సంకల్పబలమే ఉంటే
సాధించలేని దేమున్నది?
మంచుపొగనే రవిబింబంగా
మార్చివేయగలుగుతుందది.

## 5

ఆత్మలు జ్వలించే అగ్నులు
వాటి బూడిదలే ఈ దేహాలు.

## 6

కవిత్వం హృదయజ్వాల
వక్తృత్వం హిమఖండహేల
ఆ మంటనూ ఈ మంచునూ
ఐక్యం చేసేది ఎలా?



అసలే మనుషలు దుర్బలులు
అందులో పచ్చేటన్ని చీలికలా ?
అసలే ఈ లోకం ఇరుకు
అందులో ఇన్నిన్ని రాజ్యాలా ?

**8**

అన్నీ తిన్న మానవుని
అజీర్తే వేదాంతం.

**9**

వారసత్వంతోనే మానవుడు
వరణీయుడు కాడు.
నరహంతకుల వంశంలో
పురుషోత్తము లెందరులేరు?

**10**

ఎవరి నెవరు సృష్టించిరి
మనిషిని దేవుడా? దేవుణ్ని మనిషా?
కల్పనయే ఈ సృష్టికి మూలమంటాను.
కళయే దాని సువ్యక్త రూప మంటాను.

**11**

జ్ఞానికీ అజ్ఞానికీ మధ్య వ్యత్యాసం
సాలెగూటికన్న చాలా చాలా సున్నితం.

**12**

కడలి కుంగినపుడు; ఇసుకపైన
వ్రాసినాను నా అనుభవకోశం.
కడలి పొంగినపుడు; ఇసుకలోన
చూసినాను అజ్ఞాన శేషం.



మిన్నులకు అతీతంగా విరబూసిన పువ్వు
ఎన్నడూ వాడిపోదు.
ఉదయ సంధ్యావధువు పెదవిమీది పాట
ఎన్నడూ ఆగిపోదు.

## 14

పుట్టిన ప్రతి మనిషికీ
మృత్యువే చరమావధి.
ఆత్మకు మాత్రం అది
అంతమే లేని ఆది.

## 15

పుత్రెకెక్కని చదువులు వల్లెవేసేవాడు
పుస్తకాలను మోసే గాడిదకు సైదోడు.

## 16

తిరుగుబాటులేని జీవితం
వసంతంలేని ఋతువలయం.
కట్టుబాటులేని తిరుగుబాటు
వట్టి ఎడారిలో వసంతోదయం.

## 17

మానవాత్మ - ప్రజ్వలించే మహోజ్వాల
విడివడిందది పరమాత్మనుండి సృష్టివేళ.

## 18

ప్రతిహేమంతం ఎదలో వణవణ
వణికే వసంతముంది.
ప్రతిరాత్రి ముసుగుతెరలో చిరునగ
వొలికే ప్రభాతముంది.



అసంఖ్యాక పథాలలో పయనిస్తుంది విజ్ఞానం
ఆరంభమే తప్ప దాని అంతం తెలియదు మనకు.
కడదాకా నడిపిస్తుంది కనిపించని కాలం
కానీ మనం చూసేది మలుపు తిరిగేవరకు.

**20**

పిరికిమందు తాగితాగి
పెరిగిన మానవమాత్రుడు
వరదనుచూస్తే చాలు
నెరియల్లో నక్కుతాడు.

**21**

సాహసం ఒక అగ్నిపర్వతం
ననేమీ మొలవదు దానిపై భీరుత్వబీజం.

**22**

కొందరి హృదయాలు
బళ్లలోని నల్లబల్లలు.
కాలమేమో గీతలుగీస్తుంది.
తడిగుడ్డేమో తుడిచేస్తుంది.

**23**

ఉన్నదాన్ని కనుగొంటాడు మానవుడు
లేనిదాన్ని సృష్టించలేనే లేడు.

**24**

తినేటప్పటి హడావిడి
నడిచేటప్పుడు నాస్తి.
ఐతే - ఒక వినతి.
అడుగులతో తినండి
అరిచేతులతో నడవండి.



ఈజిప్టు పిరమిడ్లు నేలపైకి ఒరిగినా
న్యూయార్కు సౌధాలు ధూళిలోన కరిగినా
సీతాకోకచిలక తేలుతూవుంటుంది చేలపై
హిమబిందువులు రాలుతూవుంటాయి పూలపై.

## 26

ఏమిచెప్పను ?
నేనిచ్చిన సొత్తుతో కత్తి సంపాదించి
నన్నే పొడవాలనుకునేవాణ్ని గురించి.

## 27

అతడు నాకు తెలియదా ?
అతని బాబే తెలిసినప్పుడు.

## 28

పుట్టినప్పటినుండి పరిమళాలే లేని
పూలెన్ని లేవు ?
గగనాన మూగి వర్షించగాలేని మే
ఘా లెన్ని లేవు ?

## 29

శిరసెత్తుతారు కొందరు గిరిశిఖరాల్లా
కానీ పడివుంటారు కారుచీకటి గుహల్లా.

## 30

దూరంగా ఉంచు ప్రభూ !
కరుణలేని విజ్ఞానం నుంచి
చిరునవ్వెరుగని వేదాంతం నుంచి
శిశువు ముందు శిరసొగ్గని
అహంకారం నుంచి.



పరమభక్తుల అస్థి
పంజరమ్ముల పైన
గుళ్ళు కట్టే ధర్మ
కోవిదులు ఎందరో ?

32

ధనాన్ని తృణీకరించుమని
ధర్మపన్నాలు వల్లించే
ధనస్వాములున్నారు జాగ్రత్త!

33

చరిత్ర పునరావృత్తం కాదు
చరిత్ర ఎరుగని మతులలో తప్పు.

34

కాపాడవయ్యా ప్రభూ! నన్ను
కాటువేసే పాములనుంచి
ఓటమి పొందిన కీర్తికాములనుంచి.

35

పురుషోత్తము డెవడు?
పొగిడితే మందహాసం చేసేవాడు
తెగిడితే మౌనం వహించేవాడు.

36

దేశ నాశకు డెవడు?
నేల దున్నని వాడు
నేత నేయని వాడు
రాళ్లుమోయని వాడు
రాజకీయమే వృత్తిగా
రంగు ఫిరాయించే వాడు.



'నీ శత్రువును ప్రేమించు' మని
నా శత్రువు చెప్పగా విని ;
అక్షరాలా పాటించాను
నన్ను నేనే ప్రేమించాను.

**38**

ఆశావాది చూసేది ముళ్లనుకాదు; గులాబీని.
నిరాశావాది చూసేది ముళ్లనే; కాదు గులాబీని.

**39**

నరకమంటే వణికిపోవడమే నరకం.
స్వర్గమంటే ఉబికిపోవడమే స్వర్గం.

**40**

అతిశయోక్తుల మాటున
ఆత్మదృష్టిని దాచుకునే మగవాడు
అలంకారాల మాటున
వికారాలను దాచుకునే స్త్రీలాంటివాడు.

**41**

అన్వేషిస్తాడు మానవుడు
అక్కడెక్కడో జీవితముందని.
అతడు తెలుసుకోలేడు పాపం !
అదేదో తనలోనే వుందని.

**42**

నరకం లేదు యాతనలో - అది
ఉన్నది రిక్త హృదయంలో.



ముఖం మాడ్చుకున్న బెబ్బులి అటు
ముసి ముసి నవ్వుల తోడేలిటు.
ఆ రెండు దుశ్శక్తుల మధ్య
ఆవురనే గొర్రెల మంద.

44

తలుపుమీద వ్రాసినాను
'సంప్రదాయాలకు స్వస్తిచెప్పిన వారికే
స్వాగతం లభిస్తుం'దని.
ఒక్క పురుగు వాకిట అడుగు పెడితేనా!
నా తలుపు తడితేనా!

45

అజ్ఞాన సదనాన
ఆత్మ దర్శనమునకు
అద్ద మెక్కడిదిరా!

46

పశ్చాత్తాపంతోనే పరమపదం అందదురా
పవిత్ర హృదయంలో అది పదిలంగా ఉన్నదిరా.

47

సకల జనులూ ప్రకృతి ముందు
సచేతనులే స్వచ్ఛందులే.
మానవుని వైభవం వట్టి కల
మరునిముసం చెదిరిపోయే నురగలా.

43

ఎవరితో ఉంటావో తేల్చుకో -
నిన్నటి దాస్య వర్తులతోనా?
రేపటి స్వేచ్ఛా మూర్తులతోనా?



తాను అనుకున్న గోడనూ
తాను నడిచే జాడనూ
అదే పనిగ చూసేవాడు
హ్రస్వ దృష్టి కలవాడు.

### 50

విద్యలేని విచక్షణ
సేద్యం చేయని క్షేత్రం
పోషణలేని దేహం.

### 51

నిరుపేదలు పండించిన పంటను
కిరాతకులు కాజేస్తుంటే
చట్టం పేరుతో ఉన్న దమననీతి
చుట్టూ కాపలా కాస్తున్నది.

### 52

హంతకులంటున్నాం మనం
హత్యలు చేయని వాళ్లను.
దొంగలంటున్నాం మనం
దోపిడీ ఎరుగని వాళ్లను.
కల్లరులంటున్నాం మనం
కటిక నిజాలు పలికేవాళ్లను.

### 53

ఎందుకు చూపుతావు జాలి ?
మాకు న్యాయం కావాలి.
అపరాధులపై కురిపించుకో నీ జాలిని.
అమాయకులు మాత్రం కోరుకునేది న్యాయాన్ని.



పాటలోని రహస్యం
పట్టువడి పోతోంది
గాయకుని గళాన్ని బట్టి
సహృదయుని స్పందనను బట్టి.

## 55

నీ తల్లి ఎవరో చెప్పు.
ఆ తర్వాత చెబుతాను నువ్వెవరో.

## 56

లోయలను చూడాలంటే
గిరి శిఖరం చేరుకో.
గిరి శిఖరాన్ని చూడాలంటే
మబ్బుల్లోకి దూరిపో.
మబ్బులోతు తెలుసుకోవాలంటే
కళ్లు రెండూ మూసుకో.

## 57

అగ్నిపర్వతం లాంటిది ఉత్సాహం
మొలవదు దానిపై ఏ సందేహం.

## 58

ఆత్మ రహస్యమే అసలైన కవిత్వం
అంతకుమించి అధిక ప్రసంగం వ్యర్థం.

## 59

అందరూ యోధులే జీవిత సమరంలో —
కొందరు అగ్రసరులు
కొందరు అనుచరులు.



జడప్రాయంగా ఉన్న
అమితజ్ఞానం కన్న
చైతన్య రూపంలో ఉన్న
పరిమితజ్ఞానం మిన్న.

**61**

అసలైన వేదాంతి ఎవడు ?
అన్ని రుచులూ చూసినవాడు
ఆపై తిరుగుబాటు చేసినవాడు.

**62**

అనేక విధాలుగా తననే
అర్చించుకుంటాడు మానవుడు.
అతని ఆత్మపూజకు నా
మాంతరమే దేవుడు.

**63**

చిరిగిపోయిన ఆలోచనలను
అరువుమాటల మాసికలతో
కప్పిపుచ్చే కవులు కలరెందరో.

**64**

నమ్మకం వేరు నడక వేరు.
ప్రసంగిస్తారు పలువురు సాగరాల్లా
జీవిస్తారు పాడు బురద గుంటల్లా.

**65**

తప్పుకుంటాను నేను
గభీరతనూ సుకుమారతనూ
భీరుత అనేవాళ్ల నుంచి.
వాచాలతను వివేకంగా
మౌనాన్ని అజ్ఞానంగా
భావించే వాళ్ల నుంచి.



గొలుసులో కట్టువడ్డ ప్రతివాడు
తలవంచినవాడు కానే కాడు.
ఒక్కొక్కప్పుడు ఆ ఉక్కు సంకెల
కాకపోదు నవరత్నమాల.

**67**

చట్టాల వలలు పన్నే దెందుకు ?
చిట్టి చేపలను పట్టేటందుకు.

**68**

దయ్యమంటే భయముంటే
దైవమంటే సంశయమే.

**69**

కొందరు చెవులతో వింటారు
కొందరు పొట్టలతో వింటారు.
కొందరు జేబులతో వింటారు
మరి కొందరు విననే వినరు.

**70**

చేలలోని ఏలపాటలు ఎలా వింటాము ?
చెవులలో నగరసంగీతం చవులూరుతుంటే.

**71**

ప్రతి మనిషి నెన్నుదుట
వ్రాసివుంది వాని చరిత.
అది చదువగలిగిన వాడు
ఆత్మలిపి నెరిగిన వాడు.



సంగీత మొక్కటే మానవుల
సర్వ సామాన్య భాష.

## 73

వన్నెచిన్నెలతో మరులు గొలిపే
వగలాడి వంటిది జీవితం.
ఆ టక్కు తెరిగిన వాడు
అందకుండ సాగిపోతాడు.

## 74

ఎవరు ఎవరు బానిసలు ?
పాడుషాల దోషాలు.

## 75

మానవుని మనుగడ
కడలిపై తేలియాడే నురగ.
గాలి వస్తే అది గల్లంతే
మృత్యువు వస్తే అందరూ అంతే.

## 76

జీవితం కేవలం వినోదమే కాదు.
అది - ఆకాంక్షకూ దీక్షకూ నిలిచిన పాదు.

## 77

ధనం—
కుహనా ప్రణయానికి బీజం
మృషా సౌభాగ్యానికి మూలం.
విషాక్త జలమయ కూపం
వార్ధక్య పరిపీడన రూపం.



ఏ ఋతు సంగతి లేకున్నా విక
సించే కుసుమం ప్రణయం.

**79**

ధనాన్ని కోరుతుంది ధనం.
దాని పర్యవసానం—
అశాంతి, ఆవేదన.

**80**

సత్యం—
అవ్యక్త నిశీధంలోనే
అగుపించే నక్షత్రగుచ్ఛం.

**81**

కన్టైదుట ఉన్న ప్రకృతిని
కటిక చీకటి కప్పేస్తుంది.
ఎదలో నిండిన ప్రణయాన్ని
అది ఎలా దాచేస్తుంది?

**82**

మట్టితో మధుపాత్రను సృష్టించవచ్చు
వట్టి ఇసుకతో తీర్చేదేమిటి దిద్దేదేమిటి ?

**83**

నా ఆత్మ బోధించింది.
ఏమని ?
మరుగుజ్జుకంటే ఉన్నతుణ్ని కానని
మహా కాయునికంటే చిన్నవాణ్ని కానని.



రెండు అంశాల మధ్యలో ఉన్న
సందును వెతకడమే వేదాంతం.

## 85

మనకంటే ఘనమైనవి కావు
మనరూపాలూ, నుడులూ నడవడులు.
ఆత్మయే మన ఆలయం
అక్షులే గవాక్షాలు.
మాటలే దూతలు.

## 86

సిరుల బరువుతో నా హృది
పరిశ్రాంతమైయున్నది.
రండి ధనాన్వేషులార !
గుండె బరువు దించిపొండి.

## 87

హృదయంలో యుగయుగాల
మధువు తొణికిపోతున్నది.
రండి పిపాసువులారా !
గుండె నిండ తాగిపొండి.

## 88

రసాత్మలను మిన్నులకెత్తే
విశృంఖల ప్రణయగతిని
అరికట్టలేవు శాసనాలు
అడ్డగించలేవు పరిసరాలు.



మొదటి ముద్దు - వలపుపాటకు తొలకరి
జీవిత తరుశాఖా శిఖపై విరిసిన తొలివిరి.
నాలుగు పెదవులు పలికే మౌన మంత్రాక్షరి.

90

అసలైన జాతీయ సంపద
పసిడిలో లేనే లేదు.
విద్యలలో ఉంది; వివేకంలో ఉంది.
అనవద్యమైన ఆర్జవంలో ఉంది.

91

నిశ్చయబుద్ధి లేని విజ్ఞాని
నిరాయుధంగా అనికిసాగే సేనాని.

92

పూలు దొంగిలించినవాడు హీనుడట
చేలు కొల్లగొట్టినవాడు ధీరుడట.
తనువును చంపినవాడు దండనార్హుడట.
ఆత్మను హింసించినవాడు హాయిగా ఉండాలట.

93

నా ఆస్తిని హరించినా
నా రక్తాన్ని చిందించినా
నా ఆత్మను బాధించలేరు
నా ధర్మాన్ని సాధించలేరు.

94

పంజరంలో ఉన్న పక్షి కట్టుకోదు గూటిని
తన పిల్లల కాగూడు పంజరం ఔతుందని.



శక్తి సహనాలు
సమ భాగస్వాములు.

## 96

పసిడి కూడబెట్టుకునే
పిసినిగొట్టు జీవితం
సమాధిలో లుకలుకమను
క్రిములకు రూపాంతరం.

## 97

తరులు గిరులు ఝరులు కాల
తరంగాల తాకిడితో
మారునట్లు; మనిషి మారు
అనుభవాల రాపిడితో.

## 98

గతానికి మెరుగులు దిద్దడమే కాదు అభ్యుదయం
భవిష్యత్తువైపు పరుగులు తీయడమే అభ్యుదయం.

## 99

పొరుగువానికి నీ బాధ చెప్పుకోవడం
హృదయ ఖండాన్నే అర్పించుకోవడం.
అతడు ఉన్నతుడైతే గుండెల కద్దుకుంటాడు
అల్పుడైతే పొడి నవ్వు నవ్వుకుంటాడు.

## 100

ఆత్మ నా హితవరి
అది చెప్పిన దేమని?
గళాలు పలుకని
స్వరాలు వినుమని.



అలరించలేదు గాయకుడు
అతడు పరవశి స్తేగాని.

## 102

గొప్పతనం ఎక్కడుంది ?
పదవిలో కాదు
పదవిని నిరసించిన వానిలో.

## 103

నా ఆత్మ
చీకటిలో సాగిపోయే జవనాశ్వం.
పరుగునుబట్టి ప్రభాతం
గతినిబట్టి గమ్యం.

## 104

ఆత్మను ఆకర్షించేదే
అసలైన అందం.
అందుకోవడం కాదు
అందివ్వడమే దాని చందం.

## 105

ఆచారాలకేమి పుట్టుతూనే ఉంటాయి.
చీకటిలో నీడల్లా గిట్టుతూనే ఉంటాయి.

## 106

నా చేతులకు సంకెళ్లు వేసినా
నా కాళ్ళకు గొలుసులు కట్టినా
చీకటి చెరసాలలో నన్ను నెట్టినా
స్వచ్ఛందమైన నా ఆలోచనను
చచ్చినా బంధించలేరు.

107

తాత్కాలిక లోపం - లేమి.
తరిగిపోని రోగం - తలకు మించిన కలిమి.

108

వెలతెలిసిన అందరికీ
విలువ తెలుసునంటారా ?

109

సత్యమహాసౌధానికి లెక్కలేని తలుపులు
తట్టిన వారందరికీ స్వాగతాల పిలుపులు.

110

దారిద్ర్యం వివేచనలో తలదాచుకుంటుంది
తదనంతరం కాసులకు తల ఒగ్గుతుంది.

111

వచించేదీ ప్రచురించేదీ ఏమీలేకున్నా
వాక్ స్వాతంత్ర్యాన్నిగూర్చి వాగుడు మిన్న.

112

నిన్నటి ఖాతా తిరగేస్తే నీకే తెలుస్తుంది
లోకానికీ జీవితానికీ ఎంత ఋణపడ్డావో.

113

సత్యమంటే ఏమిటి ?
సర్వేశ్వరుని వజ్ర సంకల్పం.

## 114

కట్టడంలోని గట్టిరాయి ఏది ?
పునాది అట్టడుగున ఉండేది.

## 115

మనిషి కంటి భూతద్దంలో
మహత్తరంగా అగుపిస్తుంది లోకం.

## 116

జ్ఞాపకాలు జ్ఞాపకాలు జ్ఞాపకాలు
ఆశాపథంలో పాకుడురాళ్లు.

## 117

విరితోటలో విహరించినట్లు
కడలి కడుపులో తిరుగాడేదెవరు ?

## 118

ధర్మాత్ముడు మానవుని హృదయ బంధువు.
కరుణాత్ముడు ఈశ్వరుని ఆత్మబంధువు.

## 119

బాష్పధారలో తడిసిన ప్రణయం
స్వచ్ఛంగా ఉంటుంది నిరతం.

## 120

వదనంలో లేదు అందం.
అది హృదిలోని కాంతి పుంజం.

121

మూర్ఖునితో చేసే స్నేహం
తాగుబోతుతో జరిపేవాదం.

122

అజ్ఞాన మూలమే తెలుసుకుంటే
అప్పుడు నేను మహర్షినే.

123

నువ్వంటే నా కిష్టం.
ఎందుకని ?
ప్రబల దుర్జనుడిముందు పరమదుర్బలుడివి
సంపన్న లోభిముందు నిరుపేద జీవివి
అందుకని.

124

వివరించే అవసరం ఎందుకొస్తుంది
విషయం అసమగ్రమైనప్పుడే.

125

నువ్వు పేదవాడివైతే ఏంచేయాలి ?
సిరుల కొలమానాలతో నరులను కొలిచేవారి
స్నేహాన్ని తెంచుకోవాలి.

126

మంచు బిందువును తిలకిస్తున్నాను
మహోదధి రహస్యాలు కనుగొన్నాను.

127

పరిపూర్ణ పరిజ్ఞానమే కవిత్వం - అది
సగం తెలిసిన వానికి అందని పరమార్థం.

128

సహన క్షేత్రంలో నాటిన బాధ
సంతోషఫలాలను అందిస్తుందిగదా !

129

ప్రణయం లోతు తెలియదు
విరహం ముంచుకొచ్చేవరకు.

130

మరణమంటే మహా భయం
నిదురన్నా కలలన్నా ప్రియం.

131

ప్రకృతి ప్రసవించిన పాపలే పూలు
అనురాగం కుసుమించిన పూలే పాపలు.

132

ఏకాంతంలో బలవంతుడు ఎదుగుతాడు
పాపం ! దుర్బలుడేమో అణగుతాడు.

133

పాట పాడలేదు
పాడు నోటివాడు.

**134**

వణికిపోయే ఆనందమే
వలపు.

**135**

పక్కదారి తొక్కినవాడే
రచ్చకెక్కుతాడు.
పదుగురితో నడిచేవాణ్ని
పట్టించుకోడెవడు.

**136**

ఏదీ మనభయంకర లోపం
ఇతరుల లోపాలను ఎన్నడం.

**137**

తుఫాను గర్జిస్తుంటే ఎవరువింటారు
కొండవాగు తీసే కూని రాగాన్ని.

**138**

అనురాగం- మృత్యువులాగే
అన్నిటినీ మార్చేస్తుంది.

**139**

సాగర సంగీతం ఆగేది తీరంలోనా?
శ్రవణించే వారి హృదయద్వారంలోనా?

## 140

కళయేదో నన్నడుగు.
వ్యక్తం నుంచి అవ్యక్తంలోకి
వేసే ఒక అడుగు.

## 141

ఇలను దున్ని విత్తనాలు అలికినప్పుడే
ఇలలో మొలకెత్తింది నాగరికత.

## 142

ఋజువును కోరే సత్యం
నిజంగా సగం సత్యం.

## 143

కవిత్వం ఒక మెరుపు
కాదది పొడిమాటల కూర్పు.

## 144

కనులతో చూసే దాని కన్న
మనసులోని సౌందర్యం మిన్న.

## 145

అనురాగంతో కూడుకున్న బాధ
ఆనందదాయకం కాదా!



తుఫానులకు జడిసేవాళ్లు జీవన్మృత్యులు
తుఫానులతో నడిచేవాళ్లు చైతన్యవ్రతులు.

147

అచ్ఛమైన పూజకు
అక్కరలేదు ఏకాంతం.

148

ఎంత అల్పుడు వాడు!
ఈజగమునకు బదులు
అరిచేతి గీతలను
పరికించువాడు.

149

ఎవడయ్యా స్వేచ్ఛా పరుడు?
ఓపికగా బానిసల బరువులు
మోసుకు పోయే వాడు.

150

తన అశ్రుధారలో తానే తడిసిన వాడు
మునుముందు స్వచ్ఛంగా మనగలుగుతాడు.

శ్రీ—శ్రీ




తెలుగు ఎదలో తెలుగుతనం
వెల్లువలా పారాలని
తెలుగింటిలో తెలుగుదీపం
అఖండంగా వెలగాలని
ఈజాతి నిదురలేచి
మహోన్నత మానవాదర్శాల వైపు
నిరంతర కృషితో
పయనం కొనసాగించాలనే ధ్యేయంతో
ఉడుతాభక్తిగా యువభారతి కృషి చేస్తున్నది.
భాషాభిమానం కలగాలంటే
మాతృభాషా సాహిత్య పఠనమే
ప్రథమ కర్తవ్యం అనే భావం
బలంగా మనసులో నాటుకోవటానికి గాను
వీలైనంత ఎక్కువ మందికి వీలైనంత తక్కువ వెలకు
ఉత్తమసాహిత్యం అందిచేందుకు
యువభారతి పూనుకున్నది.
ప్రతి తెలుగింటిలో
కనీసం పదయినా తెలుగు పుస్తకాలు ఉండేందుకు
మనందరం ఉద్యమ వేగంతో కృషి చేద్దాం.
ఆ పదిమంచి పుస్తకాలలో ఏ ఒక్కటిగానైనా
యువభారతి ప్రచురణ ఏ ఒక్కటైనా
ఉండాలనే ధ్యేయంతో కృషిచేద్దాం.

**యువభారతి**

**సాహితీ సాంస్కృతిక సంస్థ**
**5, కింగ్స్‌వే, సికిందరాబాదు-3**